# ప్రకాశకీయము

ఏ విషయాన్ని ఒక రచయిత వేల శబ్దముల ద్వారా సమగ్రముగా గ్రహింపజేయజాలడో అట్టి విషయమును చిత్రకారుడు తన ఉన్న చిత్రము ద్వారా చక్కగా అవగాహన జేయింపజాలును. చిత్రకళ మహిమ అట్టిది. అట్టి దృష్టితో ఆలోచించినప్పుడు గజానన గణేశుడొక శ్రేష్ఠ కళాకారుని యద్భుత కల్పనగా బేర్కొనవచ్చును. ఇది అనేక గంభీర విషయములను ప్రకటించు కళాత్మక చిహ్నము. భారతీయ దేవీ దేవతల విషయమై హిందీ ''గణేశ రహస్య'' రచయిత శ్రీయుత జ్యేష్ఠవర్మన్ అధ్యయనము గావించెను. క్రీ.శ. 1987లో వారు ఆకాశవాణి, ముంబాయినుండి యీ విషయమై ప్రసంగించిరి. మహారాష్ట్ర, కర్నాటక రాష్ట్రములలో అనేక చోట్ల వారు గావించిన ఉపన్యాసములు ప్రశంసల నందుకొనినవి.

పుస్తకములో వైజ్ఞానిక రహస్యములు పాఠకులకు మార్గదర్శకములు కాగలవని ఆశించుచున్నాము. వానిని సమగ్రముగా అర్థము జేసికొనిన ధర్మానుసరణలో తోడ్పడును. అది దేశాభ్యుదయమునకు, జాత్యభ్యుదయ మునకు దారి తీయగలదు. అట్టి తఱి మా కృషి సార్థకము కాగలదు.

భవదీయుడు

**టి. సూర్యనారాయణ**

అధ్యక్షుడు, గాయత్రీ ఆశ్రమము,

వ్యాస్‌నగర్, సికింద్రాబాదు-361

# మా ప్రచురణలు

| | | రూ. పై |
|---|---|---|
| 1. | అగ్నిహోత్రము-వైజ్ఞానిక స్వరూపము | 4-00 |
| 2. | వైదిక వైజ్ఞానిక సంస్కృతి | 4-00 |
| 3. | మానవ ధర్మము | 1-60 |
| 4. | వైదిక అర్థనీతి | 1-00 |
| 5. | నమస్తే సమీక్ష | 1-00 |
| 6. | దేవునకు మానవునకు మధ్య .... | 0-50 |
| 7. | యుగపురుషుడు శ్రీకృష్ణుడు | 5-00 |
| 9. | గాయత్రీ మహామంత్రము | ఉచితము |
| 10. | శాంతిసూక్తము మంత్రపాఠము | ,, |
| 11. | గణేశ రహస్యము | ,, |
| 12. | వైదికక్రాంతి (ఆంగ్ల మాసపత్రిక) | ,, |

పోస్టు ఖర్చులు అదనము. పుస్తకములు బుక్ పోస్టులో పంపగోరువారు రు. 1/-లు అదనముగా పంపవలెను. వి.పి. పద్ధతి లేదు. మొత్తము పైకము ముందుగానే పంపవలెను.

ప్రతులకు :

**గాయత్రీ ఆశ్రమము,**

వ్యాస్‌నగర్, సీతాఫలమండి, సికింద్రాబాద్-500 361.

# శ్రీ గణేశుని రహస్యము

శ్రీ గణేశునకు నమస్కరించనిదే ఏ హిందువైనను శుభాశుభ కార్యములను ప్రారంభించడు. విఘ్నములను తొలగించు శక్తివంతుడని విశ్వసించెదరు. గణేశునకు హిందువుల దేవీదేవతలలో ప్రముఖ స్థానము గలదు.

శ్రీ భండార్కరు ననుసరించి గాణాపత్య సంప్రదాయము అయిదవ శతాబ్దము నుండి ఎనిమిదవ శతాబ్దపు మధ్యకాలములో యేర్పడినట్లు భావింపబడుచున్నది. ప్రపంచమంతటా ఈ సంప్రదాయము ప్రచారము గావించబడినది. చైనాలో క్రీ.శ. 531లో జేయబడిన విగ్రహము, ఆఫ్గనిస్తానములో ఆరవ శతాబ్దమునకు జెందిన పాలరాతి విగ్రహము, న్యూయార్కు, టొరెంటో, నేపాలు, టిబెట్, జపాను, ఇండోచైనా, సయామ్, బర్మా, మలయా, జావా, బోర్నియో, సుమత్రా మొదలగు దేశములలో పురాతన కాలమునకు జెందిన వినాయక విగ్రహములు కనుగొనబడినవి.

అనేక పురాణములలో గణేశునికి సంబంధించిన గాథలు భిన్న భిన్నముగా గన్పించుచున్నవి. అన్నిటికంటె పార్వతీదేవి స్నానమునకు వెళ్ళుటకు పూర్వము నలుగుపిండితో గణేశుని చేసి ప్రాణముబోసి కావలి

యుంచినటుల, ఆతడు శివునికూడా లోనికి వెళ్ళకుండా అపుజేసెననియు, అంతట ఆగ్రహముచే శివుడు ఆతని తల నరికెనని జెప్పుదురు. పార్వతి రోదించగా కరుణ వహించి యేనుగు తలను తెచ్చి అతికించెనను గాథ బహుళవ్యాప్తముగా నున్నది. అట్లే అనేక రకములైన స్తోత్రములు, ఆకారములు ప్రచారములో నున్నవి.

వైదిక సాహిత్యమును శ్రద్ధగా నవలోకించిన యెడల గాథలందు గణపతి రహస్యము, అందుగల సత్యాసత్యములు విదితము కాగలవు.

## వేదములలో గణపతి

ఋగ్యజుర్వేదములలో గణపతియొక్క వర్ణన గనుపించును.

"గణానాంత్వా గణపతిగ్ంహవామహే కవిమ్
కవీనా ముపమశ్రవస్తమమ్
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పతి ఆనఃశృణ్వన్ నూతిభిః
సీదసాదనమ్ ॥

ఈ మంత్రముయొక్క దేవత బ్రహ్మణస్పతి. బ్రహ్మ శబ్దమునకు పరమాత్ముడు, బ్రహ్మాండము, సూర్యుడు, ధనము, అన్నము, మనసు, ప్రాణము, వాక్, వేదము. యజ్ఞము, బ్రాహ్మణుడు, అందరికంటె పెద్దవాడు అను అర్థములు వచ్చును. నాలుగు వేదములు నేర్చిన విద్వాంసులను బ్రహ్మయందురు. యజ్ఞమునందు ముఖ్యపురోహితుని బ్రహ్మయందురు. బ్రహ్మయొక్క పతి బ్రహ్మణస్పతి. అనగా బ్రహ్మాండము, వేదము, అన్నము, యజ్ఞము, ధనమున కధిపతి. పరమేశ్వరునకే బ్రహ్మణస్పతి శబ్దము జెందును.

గణములకు పతి గణపతియని పరమేశ్వరునకే జెందును. కవులకు కవి జ్యేష్ఠరాజ అనునవి విశేషణములు. గణనీయమైన వస్తువులను గణము

లందురు. అట్లే ప్రజలను, సమూహమును, సైన్యము మొదలగు వానిని కూడా గణములందురు. అందుచేత ఇచ్చట గణపతి శబ్దము పరమేశ్వరు నకే జెందును. పరమేశ్వరుడు కవులకు కవి. కవియను శబ్దము క్రాంతి దర్శకులు, క్రాంతిప్రజ్ఞ ఋషులకు వర్తించును. సర్వజ్ఞుడైన పరమేశ్వ రుని కావ్యము వేదము. సృష్టి యాతని రచన. అందాతని సర్వజ్ఞత్వము గోచరించును. ఆతడు మాత్రమే మనకు ఉపాసనాయోగ్యుడు, అనుకరణీ యుడు, ఉపమానయోగ్యుడు. ఆతనిని ఉపమ యందుము. పరమేశ్వరుని స్తుతి ఉత్తమమైనది. సూర్య, చంద్ర, నక్షత్రాదుల ప్రకాశముతో నాతడే విరాజమానుడై యున్నాడు. అందుచేత నాతనిని జ్యేష్ఠరాజ మందురు. ఈ మంత్రమునందు విశేషణముల జోడించి నాతడు మా హృదయములలో నివసించి మమ్ముల రక్షించవలెనని ప్రార్థించనైనది.

## యజుర్వేదములో

గణానాంత్వా గణపతిగ్ం హవామహే ప్రియాణాంత్వా ప్రియపతిగ్ం
హవామహే నిధీనాంత్వా నిధిపతిం హవామహే వసోమమ
అహమజాని గర్భధమాత్వమ మజాసిగర్భధమ్ ॥

పరమేశ్వరా ! మేము ప్రజలను పాలించు ప్రజాపతియైన నిన్ను ఉపాసించెదము. నీవే మా ప్రియమైన పతియు మరియు రాజువు. విద్యాది ధనములకు నీవే స్వామివి. ఈ బ్రహ్మాండమంతయు నీయందే యిమిడి యున్నది. జనన మరణరహితుడవు. నిన్ను గ్రహించి నీ స్తుతి చేయు దుము గాక !

ఐతరేయ బ్రాహ్మణమునందు యిట్లు గనబడుచున్నది :
గణానాంత్వా గణపతిం హవామహే ఇతి బ్రహ్మణస్పత్యం బ్రహ్మవై
బృహస్పతిర్బ్రహ్మణై వైనంతద్ భిషజ్యతి తథాయస్యస ప్రథశ్చ
నమేతి ॥ (పంచికా ౧ గండికా ౧)

వేదములలో గణపతి, బృహస్పతి, బ్రహ్మణస్పతిగా వర్ణించబడినపరమే శ్వరుడు ఆకాశము మొదలగు పదార్థములన్నిటిలో వ్యాపించియున్నాడు. నేర్పరియైన వైద్యుడు ఔషధముల ద్వారా రోగిని రోగవిముక్తిని జేయు నటుల వేదజ్ఞానమను ఔషధముచేత అజ్ఞాన, అవిద్యయనెడు రుగ్మతనుండి మనుష్యులను విముక్తులను జేయుచున్నాడు.

గణపతియని యిచట పేర్కొనబడిన పరమేశ్వరునకు వేదములలో యనేక నామములు గలవు. ఇవి భిన్న భిన్న గుణ, కర్మ, స్వభావము ననుసరించి యేర్పడినవి. ఋగ్వేద మంత్రమునందు పరమేశ్వరుని ఇంద్ర మిత్ర, వరుణ, అగ్ని, సుపర్ణ, గరుత్మాన్, యమ, మాతరిశ్వ యను నామములతో ప్రజలు స్తుతించెదరు. (ఋ. 1-136-18), యజుర్వేద మంత్రము పరమేశ్వరుని అగ్ని, ఆదిత్యుడు, వాయువు, చంద్రుడు, శుక్ర, బ్రహ్మ, అపః, ప్రజాపతి యను నామములతో వ్యవహరింపబడు చున్నాడని తెలుపుచున్నది. (అధ్యాయము 31-మం. 11).

పరమేశ్వరునకెట్టి ఆకారము లేదు (యజు. అధ్యాయము 3. మం3) ఆతనికెట్టి శరీరము లేదు (యజు. అధ్యా. 40 మం. 7). కన్నులతో గాంచుటకెట్టి రూపము లేదు (శ్వేతాశ్వతరోపనిషద్ 4-20). అతడు జనన మరణ రహితుడు. లింగభేద రహితుడు. అతడు సర్వజ్ఞుడు, సర్వాన్తర్యామి, అజరుడు, అమరుడు, అవికారి, నిత్యుడు, పవిత్రుడు మరియు సృష్టికర్త.

## యజ్ఞేశ్వరాగ్ని గణపతి

వేదములలో యజ్ఞేశ్వరాగ్నిని కూడా గణపతిగా వర్ణింపబడినది. ఋగ్వేద మంత్ర (మం. 7 సూక్త 33 మంత్రము 1) దేవత బ్రహ్మణ స్పతి. బ్రహ్మణస్పతి యజ్ఞముయొక్క, ధనముయొక్క యజమానియని

కూడా చెప్పబడినది. అందుచేత ఈ మంత్రములో యజ్ఞముయొక్క మహిమకూడా ప్రస్ఫుటమగుచున్నది. యజుర్వేద మంత్రము (73 అధ్యా 18 మం) యజ్ఞముయొక్క మహిమ యజమానిలో కూడా గన్పించునని సూచించబడినది.

వాస్తవముగా అగ్నియే యజ్ఞము (అగ్నిర్వై వ్యావయజ్ఞో) (శతపథ బ్రాహ్మణము 3-5-4-1). యజ్ఞమును ప్రజాపతియందురు (ఏషవై ప్రత్యక్షం యజ్ఞోయత్ప్రజాపతి। శతపథ బ్రా5-3-5-3. యజ్ఞము నుండి మేఘము, మేఘముల నుండి వర్షము, వర్షమునుండి అన్నము. అన్నమునుండి ప్రజోత్పత్తి, పాలన మరియు పోషణ జరుగుచున్నది, (అగ్నిర్వైధు మ్రోజాయతే ధూమ్రాద భ్రమభ్రాద్వృష్టి ॥ (శతపథ బ్రాహ్మణము)

మన రక్తవర్ణ గణపతి ఆకారము యజ్ఞేశ్వరాగ్నినే సూచించుచున్నది. అగ్ని రక్తవర్ణము కలిగియున్నది. గణపతిని లంబోదరుడందురు. అగ్ని యన్నిటిని జీర్ణించుకొనుట వలన లంబోదరుడగును. జల, వాయువుల జీర్ణశక్తి పరిమితము కాని అగ్నియొక్క జీర్ణశక్తి అపరిమితము. ఎంత తినిపించినను అజీర్ణము కాదు. జల కాలుష్యమును వినుచున్నాము కాని అగ్ని కాలుష్యమును వినుటలేదు. గణేశుని వక్రతుండుడందురు. అనగా వంకర ముఖము. అగ్నిజ్వాలలు వంకరటింకరగా నుండును. పఞ్చముఖి గణేశుడు పఞ్చమహాయజ్ఞములు. బ్రహ్మయజ్ఞము, దేవయజ్ఞము పితృయజ్ఞము, అతిథియజ్ఞము, బలివైశ్య దేవయజ్ఞము.

గణేశుని మూషకధ్వజుడు లేక ధూమ్రధ్వజుడందురు. అగ్నికూడా ధూమ్రధ్వజుడు లేక ధూమ్రకేతుడనబడును. (ఋ 1-44-3) ఆకృతి సమానత ననుసరించి ధూమ్రమును మూషికమందురు. గణేశుని మూషక

వాహనుడందురు. అగ్నికికూడా మూషికముతో సంబంధము గలదు. తైత్తిరీయ ఉపనిషత్తు ననుసరించి భూమి సూర్యునినుండి విడిపోయినప్పుడు భూమిపై అగ్నియుండెను. కాలక్రమేణ ఆ యగ్ని మూషికమువోలె భూమి లోనికి ప్రవేశించెను. (తైత్తిరీయ సంహిత 1-1-3-3) మహర్షి దయానందుడు అగ్ని శబ్దమునకు ఆగ్నివిద్య, అశ్వవిద్య, నవవిమానాదియాన విద్యగా బేర్కొనెను. మూషికము భూమిపై, మయూరము భూమ్యాకాశములలో నడచుచున్నది గణేశునికూడా మయూరవాహను డనుచున్నారు.

గణేశుడు ద్వైమాతరుడు. అట్లే అగ్నికి పృథివి, అంతరిక్షము యిద్దరు మాతలు (ఋ. 1-31-2) రెండు అరణులను రుద్దుట వలన అగ్ని యుత్పన్న మగుచున్నది. అందుచేత రెండు అరణులు అగ్ని మాతలుగా బేర్కొనవచ్చును.

గణేశుని మహాదేవుని కుమారుడందురు. వేదములలో సూర్యుని మహాదేవుడందురు (అథ. 13 కాండము, 4 సూక్తము, 4 మం) అగ్ని సూర్యునినుండి యుత్పన్నమగుచున్నది, స్కన్దుడు, గణేశుని తమ్ముడుగా భావింపబడుచున్నాడు. స్కన్ద శబ్దమునకు అగ్ని (స్కన్దర్ గతిశోషణే) యని జెప్పబడుచున్నది. వాస్తవముగా గణపతి గార్హపత్యాగ్ని, స్కందుడు ఆహవనీయాగ్ని. దీని సంబంధము కృత్తికా నక్షత్రములో నున్నది. అందుచేత స్కందుని కార్తికేయుడందురు. కృత్తికలో ఆరు నక్షత్రములు గలవు. స్కందుని షణ్ముఖుడు, షణ్మాతరుడని యందురు. స్కందుని రెండవ పేరు కుమారుడు. కుమార్ అగ్నినేయందురు.

గణేశుని వినాయకుడందురు. విశేషనాయకుడు వినాయకుడనబడును కాఠక్ సంహితలో "అగ్నిర్వై దేవానాం సేనానీ" అగ్ని దేవతల సేనా నాయకుడు (యజు. 40-16). ఇందు అగ్నిని మమ్ము సన్మార్గములో నడుపుమని ప్రార్థన గలదు.

గణేశుని యక్షుడని యందురు. యక్షుడనగా పూజనీయుడు లేక యజ్ఞము (ఋ. 1-36-6: 1-142-9) యక్షగణపతి కల్పనకిది యాధార మనవచ్చును.

గణపతియొక్క భిన్నరూపములలో విద్యాగణపతి, బుద్ధిగణపతి, సిద్ధివినాయకుడు, లక్ష్మీగణపతి, సరస్వతీ గణపతులు కూడా గలరు. వేదమంత్రములలో మేధస్సుకొరకై ప్రార్థన జేయబడినది.

"యాం మేధాం దేవగణాః పితరశ్చోపాసతేతయామామద్య
మేధయాగ్నే మేధావినం కురు ॥యజు 32-14)

శ్రేష్ఠబుద్ధివలన మనుష్యుడు వేదవిద్యను గ్రహించగలుగును. అతడు ఉన్నతి జేయగలుగును. ఇదియే మనుష్యుని ఉత్తమసిద్ధి. ఇదియే సిద్ధి వినాయక రహస్యము. వేదవాణిని సరస్వతియందురు, ఆమె పతి పరమేశ్వరుడు. దానిని అగ్నియందురు. యజ్ఞేశ్వర అగ్నినుండి కూడా విద్యను గోరుచున్నాము. యజ్ఞమువలన వేదవిద్య రక్షింపబడుచు మరియు ఉన్నతి జెందుచున్నది.

బుద్ధియనగా సమృద్ధి. దీనినే లక్ష్మియందురు. బుద్ధిగణేశుడు లేక లక్ష్మీగణేశుని అర్థముకూడా యజ్ఞము. యజ్ఞమువలన సుఖసమృద్ధి గలుగునను విశ్వాసము గలదు (భగవద్గీత అధ్యాయము 3, శ్లో. 10)లో యజ్ఞము కామధుక్ యనబడినది. కామధుక్ యనగా కోరిన కోరిక యిచ్చునది.

గణేశునకు యొక కూతురుకూడా గలదు. గణేశునకు వివాహము కాలేదను విషయము ప్రసిద్ధము. కాని పైన పేర్కొనబడిన బుద్ధి, సిద్ధి లేక లక్ష్మి సరస్వతు లాతని భార్యలు. అనగా పైన పేర్కొనబడిన ఐశ్వర్యము మరియు విద్యకు ప్రతీకలు. ఇక అతని కూతురు రహస్యముకూడ తెలుసుకొనగలము. యజ్ఞేశ్వరుని కృపవలన యెవరి యింటియందు బుద్ధి,

సిద్ధి యనబడు లక్ష్మీ సరస్వతులు అనగా విద్య, ఐశ్వర్యము నుండునో యా పరివారమునందు ఆనన్దము, సుఖసంతోషములు స్థిరముగా నుండును. ఈ సుఖసంతోషములే సంతోషిమాత. ఇదే గణపతి కూతురు రహస్యము. ఇదే యజ్ఞఫలము. దేవి సంతోషిమాత మిడిమిడి జ్ఞానముగల పణ్డితుని కల్పన. సంతోషి శబ్దము స్త్రీలింగము కాదు. సంతోషిణి స్త్రీలింగము కాని సంతోషిమాత దేవియైనది. సంస్కృత భాషా జ్ఞానములేని పణ్డితుని కల్పన మరియు ప్రచారము. వైదిక సిద్ధాంతము ననుసరించి యజ్ఞమువలన మనుష్యుడు సంతోషము పొందగలడు.

గణేశుని పాపవిమోచనము చేయువాడని యందురు. మహర్షి యాజ్ఞవల్క్యుడు యిట్లు పేర్కొనెను : "సర్వస్మాత్పాప్మనో నిర్ముచ్యతే, యఏవః విద్వాన్నగ్నిహోత్రంజుహోతి" (శతపథ బ్రాహ్మణ 7-3-1-6 అగ్నిహోత్ర రహస్యము నెరిగి నిత్యమెవ్వరు నియమపూర్వకముగా దేవ యజ్ఞము చేయుదురో వారు సమస్త పాపములనుండి విముక్తులగుదురు. భగవద్గీతలో కూడా యజ్ఞము చేయకుండా భుజించువాడు పాపమును తినుచున్నాడు అనగా పాపియగుచున్నాడని చెప్పబడినది. శ్రీకృష్ణుడు యజ్ఞమునుగూర్చి జెప్పుచు యిది యొక్కటియే మనుష్యుని బంధములో పడవేయదనెను. మోక్షమునకు యజ్ఞమొక్కటే మార్గమనెను.

కాని హిందూ సోదరులు యజ్ఞముజేయక యజ్ఞచిహ్నమైన విగ్రహము నారాధించుచున్నారు. అగ్నియొక్క ప్రతీకలో లేక చిత్రములో వేడి, కాంతి, ప్రకాశము ఉండనట్లే ఆ విగ్రహమును లేక చిహ్నమును పూజించినప్పటికిని మనకు ప్రకాశము లభించదు. ఉష్ణముచేత అన్నము ఉడుకదు. విధిపూర్వకముగా యజ్ఞము చేసినప్పుడు మాత్రమే యజ్ఞము వలన కలుగు లాభములను పొందగలడు.

ప్రతి శుభ కార్యారంభము గణేశునకు నమస్కరించుట యనగా ఈశ్వరస్తుతి ప్రార్థనోపాసన లేక యజ్ఞకార్యము నిర్వహించుటయే యగును

ఇక గణపతి విసర్జనను గూర్చి ఆలోచించెదము. వేదములలో అనేక స్థానములలో అగ్ని నివాస స్థానము జలము లేక సముద్రమని పేర్కొనబడినది. "అగ్నిం సముద్ర వాససమ్" ఋ. 7 మం. 102 సూక్తము 5 మంత్రము. అగ్ని నీటి యొడిలో నుండును. విద్యుత్ జలములో నుండును. గణపతియనగా యజ్ఞాగ్నిని జలమందు విసర్జనజేయు ఆచారమేర్పడినది. కాని మన సోదరులు గణపతియొక్క మట్టిబొమ్మను నీళ్ళలో విసర్జించుచున్నారు. ఇది అజ్ఞానమునకు పరాకాష్ఠ. దీనివలన ప్రజల ధనము దుర్వ్యయమగుటయే గాక సమయమెంతయో వ్యర్థమగు చున్నది. మట్టిబొమ్మల విసర్జనతో ధర్మానికెట్టి సంబంధము లేదు.

ఏ పనిలో విద్యాబుద్ధుల ప్రమేయముండదో, సమయము, ధనము వ్యర్థమగునో, యెందు పాఖండత్వము, వంచన యుండునో అదంతయు అధర్మము, పాపము.

గణేశుని మహాత్మ్యము, ప్రసిద్ధతను వ్యాపింపజేయుటకు యజ్ఞము యొక్క మహాత్మ్యము ప్రచారము జేయవలసియుండును. ఋషుల వాక్కుననుసరించి "యజ్ఞోవై శ్రేష్ఠతమం కర్మ" (శతపథ బ్రాహ్మణము 1-7-1-4). యజ్ఞము సర్వోత్తమమైన కర్మ.

శక్తిగణేశుడు కూడా అగ్నినే సంకేతము జేయుచున్నాడు అగ్నియొక్క శక్తి వలననే మన పనులన్నియు నెరవేరుచున్నవి. విద్యుచ్ఛక్తి, ఊర్జస్సు వీని రూపములే ఋగ్వేదమునందు అగ్నిని "సహసస్పుత్ర"యని సూచించబడినది. అగ్ని శక్తియొక్క కుమారుడు.

యోగుల శరీరమందుగల కుండలిని శక్తి అగ్నియేయైయున్నట. అందు చేత గణతిపనిగూర్చి "త్వం మూలాధారస్థితోఽగ్నిర్నిత్యమ్" (గణపత్యాధర్వణ శీర్ష) యని చెప్పబడినది. మూలాధార స్థితియైన అగ్నియే గణపతి."

యజ్ఞమనగా దేవపూజ, సంగతీకరణము మరియు దానము. దేవపూజయనగా విద్వాంసుల ఆదర సత్కారము, అగ్నిహోత్రము మొదలగునవి. సంగతీకరణమనగా అందరు కలిసి ఉన్నతి మార్గమున పయనించుట. దానము సుపాత్రమైనదిగా నుండవలెను. వేద ప్రచారకులు, విధవ, రోగి, అనాథలైన బాలబాలికలు దానమునకు యోగ్యులు. వీరికి సహాయము జేయుట యజ్ఞమనబడును. అదేవిధముగా దేశహిత కార్యములకై పన్నులిచ్చుట కూడా యజ్ఞమనబడును. ఇట్టి యజ్ఞము జేయని వారి ధనము ఆసురీ ధనమనబడును. అదియే నల్లధనము. ఇది దేశమును బలహీనపరచును ఇట్టి ధనమునే మూషికమందురు. రాష్ట్రనిర్మాణ యజ్ఞములో దీని నాహుతి యివ్వవలసియుండును.

వేదముననుసరించి దేశార్థికాభివృద్ధికై జలమును నిరోధించు నల్లటి మేఘములు సూర్యునిచేత విచ్ఛిత్తిజెంది అందర కుపయోగపడునటుల వర్షించును. అట్లే ధనమును లోభబుద్ధితో కూడబెట్టి యితరుల కుపయోగపడకుండునట్లు జేయు ధనాధిపతులకు హితము గరపి లేక వివశులజేసి అందర కుపయోగపడునటుల జేయవలెను.

"ప్ర వ ఇన్ద్రాయ బృహతే మరుతో బ్రహ్మార్చత,
వృత్రం హనతి వృత్రహా శతక్రతుర్వజ్రేణ శతపర్వణా ॥
ఋ. 8-89-3

లోభులైన ధనవంతుల వలననే మానవ సమాజములో ఆర్థిక సంకటములు ఉత్పన్నములగుచున్నవి. భ్రష్టాచారము వ్యాపించుచున్నది. వీరు యజ్ఞము

జేసెదరు. దానము జేసెదరు. వారి సంపద అనేక జాతి వ్యతిరేక శక్తులను పోషించును. "అయజ్వానాంతు యద్విత్త మాసురస్వంత దుచ్యతే॥ మను. 11 అధ్యాయము 10వ శ్లోకము. యజ్ఞము చేయని వారి ధనము అసురధనము. దీనిని నాశనము జేయనిదే లోక కల్యాణము కాజాలదు.

"ఏష తేరుద్రభాగః సహస్వస్రాంబికజుషస్వస్వాహా
ఏష తేరుద్రభాగ ఒఆఖు స్తేపశుః యజు. 3-57

యజమాని ప్రయత్నించి కృషిజేసి ఆర్జించిన ద్రవ్యమును యజ్ఞము నందాహుతి గానిచ్చునపుడు .... ................స్వాహా ! ఇదంనమమ అనును. ''ఇది నాది కాదు'' అని దీనిఅర్థము. ఇచ్చట స్వార్థము, అహంకారమును త్యజించవలసియుండును. అగ్ని కూడా ''ఇదం నమమ'' యనును అగ్ని మనమిచ్చిన ఆహుతిని తాను తనకొరకై యుంచుకొనక సూక్ష్మరూపములో వాయు మండలమున కప్పగించును. వేల ప్రాణులకు లాభము జెకూర్చును.

''శతహస్తం సమాహార, సహస్రహస్తసంకిర'' యని వేదమాదేశించుచున్నది (అథర్వ 3-24-5). వంద చేతులతో నార్జించి సహస్రహస్తములతో వితరణజేయుము. ఎంత ఉత్సాహముతో నార్జించెదమో నంతకంటె పదిరెట్లు ఉత్సాహముతో వితరణజేయుము.

వేదములలో విద్వాంసుడైన బ్రాహ్మణుని అగ్ని యనబడినది. 'అగ్ని శబ్దార్థము అగ్రణియనగా ముందు నడచువాడు, నాయకుడు, సేనాపతి లేక ప్రముఖవ్యక్తి. అగ్ని అంధకారమును తొలగించి ప్రకాశమిచ్చునట్లు విద్వాంసుడు అజ్ఞానాంధకారమును తొలగించి జ్ఞానప్రకాశమొసంగును

''సమిద్ధో అద్యమనుషోదురోణె దేవో దేవాన్యజసిజాతవేదః
ఆచవహ మిత్రమహశ్చికిత్వాన్త్వం దూతః కవరసిప్రచేతాః ॥
(యజు 27-24)

విద్వాంసులు, కవులు, జాతవేదులు, మేధావులు, జ్ఞానులు, వీరు బుద్ధిమంతులు, జ్ఞానులు. వీరు దూతలు. దూత శబ్దమునకు వైదిక అర్థము ''యోదునోతి తాపయతి దుష్టాన్యః'' దుష్టుల, ధూర్తుల, కుటిలుర దుఃఖమును దూరము జేయువారు, దుష్టులను నిర్మూలించుటకు ప్రయత్నించు వారు, అగ్ని గుణముతో నిండిన విద్వాంసుడే దూతయనబడును. వేరొక మంత్రమిట్లు చెప్పుచున్నది.

''అగ్నిర్నః శత్రూన్ ప్రత్యేతు విద్వాన్ ప్రతిదహన్నభిశస్తిమరాతిమ్ (అథర్వ 3-1-1)

ప్రజలను హింసించువారు, సమాజ వ్యతిరేకులు, జాతి విరోధులు. ధర్మ వ్యతిరేకులు, మానవ సమాజ శత్రువులు, స్వార్థులు, కుటిలురు, లోభులను అగ్నివలె విద్వాంసులు సమూలముగా పెరికివేయవలెను.

భారతదేశము సకల వైభవములతో సంపన్నమై ప్రపంచ దేశాలలో సభ్యదేశమై యున్నప్పుడు బ్రిటను దారిద్ర్యమున మునిగి అనాగరకముగా నుండెను. కాని 19వ శతాబ్దమునందు బ్రిటను సమృద్ధ దేశమై నాగరికతా శిఖరములపై జేరెను. భారతదేశము పాతాళమునకు దిగజారి పోయెను. స్వాతంత్ర్యసిద్ధి తర్వాత భారతదేశ స్థితి పూర్వపుటౌన్నత్యమునకు జేరునని ప్రజలాశించిరి కాని పరిస్థితి మెరగుపడక పోగా దిగజారి పోయినది. దీనికి కారణము విద్వాంసులు ఉపేక్షా భావము వహించుటయే యైయున్నది. స్వాతంత్ర్య సంగ్రామమునందు విద్వాంసులు యెట్లు తమ హక్కులు, ఆదర్శముల కొరకై సంఘర్షణ గావించిరో అట్లే దేశమునకు, సమాజమునకు నాయకత్వము వహించి అన్యాయము, అసత్యము, అధర్మమునకు వ్యతిరేకముగా సంఘర్షణ జేయవలసి యుండెను.

శ్రద్ధాభక్తులు సత్య జ్ఞానములపై నాధారపడి యున్నవి. మనుష్యునిచే నిర్మించబడిన యీ విగ్రహమును పరమేశ్వరుడని భావించి పూజించుట సత్యజ్ఞాన విరుద్ధము. అంధవిశ్వాసము వలన అనర్థము తప్ప యెట్టి

ప్రయోజనముండబోదు. ప్రతి సంవత్సరము మట్టి విగ్రహముల నిర్మాణ మునకై, వాటి పూజలకై కోట్లకొలది రూపాయలు వ్యర్థముగా వినియోగించబడుచున్నవి. జాతి విద్రోహ శక్తులు దీనివలన లాభపడుచున్నవి. ప్రతి సందులో చందాలు ప్రోగుచేసి అశ్లీలములైన సినిమా పాటలు వేయబడుచున్నవి. పరస్పరము కలహములు, దెబ్బలాటలు జరుగుచున్నవి. ఇవన్నియు మన ధర్మమునకు, సంస్కృతికి వ్యతిరేకములు.

మన కోరికలు వాటంతటవియే నెరవేరవు. నిదురించు సింహము నోటిలో మృగము దానంతటదియే ప్రవేశించదు. కార్యసిద్ధికై పురుషార్థమవసరము. పరమేశ్వరుని కృపబడయుటకై నాతనిని ఉపాసించుట. ఆతని యాదేశములను పాలించుట, ప్రజలతో ప్రేమపూర్వకముగా వ్యవహరించవలెను.

అగ్ని గుణము గలిగిన బ్రాహ్మణుల నాదరించవలెను. వారి చేతులలో దేశము నప్పగించవలెను. యజ్ఞములు చేయవలెను, చేయించవలెను. వేదములను పఠించవలెను. పఠింపజేయవలెను.

ఏ రోజు హిందూ సోదరులు గణపతియొక్క యీ రహస్యమును గుర్తెరిగి తదనుసారముగా ప్రవర్తించెదరో అప్పుడు మన రాష్ట్రములో బుద్ధి మరియు సిద్ధి స్థాపించబడును. మన దోషములు నివారణయగును. మన కోరికలన్నియు అవశ్యము నెరవేరును.

''ఓం తత్సత్''